గని నడువు మనెను. పరిచారకుఁడంత లోనికిఁజని మరల వచ్చి యాపురుషుని లో నున్న గదిలోనికిఁ జనుమని చెప్పెను. ఆగది మిగుల విశాలముగను దర్శనీయముగ ను నొప్పుచుండెను. అందు పలుదేశముల యనేక పుస్తక భాండారంబులు నమరియుండె. బాలుండు తదంతఃప్రదేశమునకుఁ జనువేళ నిరువురు పురుషులు సుఖాసనాసీనులై యుండిరి. వారిలో నొకండు నలువదియైదు వర్షములు పైబడినవాఁడు గంభీరవద నమును గురుకాయమును గలిగియున్నవాఁడు. ఒకచేతఁ గొన్ని కాగితములు గలిగియు న్నవాఁడు. రెండవవాఁడు ముప్పది వర్షములకు లోనైనవాఁడు అతఁడు సువర్ణఘటికా యంత్రమూలం గలిగి పట్టుచిని జరీపరిధానముండాల్చి ధనికుఁడుగఁ గన్పట్టుచుండెను. ప్రథమ పురుషుఁడు సింహపురమునంగల న్యాయవాది బృందమునకెల్లఁ బెద్దయై య నేకవర్షములనుండి యపారధనమునార్జించినవాఁడు. అతని చెంతఁ గూరుచుండిన ద్వితీ యపురుషుండు సింహపురంబునఁ గాపురమున్న యొకానొక భూస్వామి వీరిరువురకు ను నడిమిదూరమున నిరువురు లేఖకులు క్రిందఁ గూర్చుండి యేమియో లిఖించుచుండిరి.

పైఁ జెప్పిన బాలకుఁడు గదిలోనికిఁ జనువేళ వారిటుల మాటాడుకొను చుండిరి.

ప్ర.—ఈ వ్యవహారము విషయమై యెంతయు నాలోచించితిని. ఎంత చూచినను నే మియు నాధారము కనఁబడదయ్యె.

ద్వి.—అయ్యో! యితరు లెవ్వరివలనను గాదని మీ చెంతఁ జేరితిని. ఈ వ్యవహారము న నెంత ధనంబయిన వ్యయంబవుఁగాక. మీ రడిగినంత ధనమిచ్చుటకు సిద్ధముగా నున్నాఁడను. నాకు జయవాక్యము వినిపించుమార్గము నూహిం తురుగాక.

ప్ర.—కేవల మాధారహీనమైన వ్యవహారమున నెంతధనము వ్యయపెట్టిన నేమి ప్రయో జనము? అయ్యా! మీరు మరల సాయంకాలమురండు ఆలోచించెదను.

ద్వి.—అయ్యా నమస్కారము సెలవొసంగుఁడు అని నిష్క్రమింపఁ బ్రథమపురు షుఁడును గృహాంతర్వర్తి జనాహూయమానుండై లోనికిఁ బ్రవేశించె. బాలుఁ డును ప్రథమపురుష పునర్దర్శనమునకై నిరీక్షించుచు నందే కూర్చుండెను.

---

## మూఁడవ ప్రకరణము.

### దురవస్థ.

ఒకనాఁటి సాయంకాలమునఁ జిన్నిరాయనిపురంబను నొక జానపదంబున వేశ్యాగృహంబున నొక వితంతువిట్లు విలపింపసాగెను. « అయ్యో! నే నెంత పాపకర్మురాలను? ఎంత దురదృష్టవంతురాలను? ప్రొద్దున నిద్రలేచినది మొదలు సూర్యాస్తమయమువఱకు నొరులకు జంకియే సంచరింపవలయును గదా? ఎవరే కార్యమున బోవుచు « నీవెదురుగ వచ్చితివి. నాకార్యము నిరర్థకమయ్యె » నని తూలనాడెదరో అని భీతి చెందవలయును. ప్రొద్దుప్రొద్దున నిద్దురలేచి స్నానమాడి, ఎవరైనను గని «అమ్మా ప్రొద్దునసె యెదురుగ రావలయునా? నీ మొగము చూచుటంబట్టియే నాఁడెల్లి నష్టములో కదా? » యని యూఱకరే అని కొంతభయము. తోడియాఁడువారలతోడ రంగుల చీరలను రైకలను దొడిగికొని, తిలకమ్ము దిద్దుకొని నేను మాత్రమేల సంచరింపరాదు? వీనికేమి? అకటా యిఁక నాకు సాధియేమి? ఎవ్వరి పట్ల చేరుదను? దుర్న్యయమునకుఁ బాలుపడి యెట్లో కాలము పుచ్చుదమన నీదురవస్థయేమి! ఈ బాలిక యేమి? పోయినభర్త రానేరఁడు. వచ్చిన వైధవ్యము పోనేరదు. కానున్నది కాక పోదు. ఈబాలికకొక మగని గూర్చి యాతని సాహాయ్యమున జీవనము సేయుదునా? ఎవఁడు గ్రహించును? విధవా పుత్రికగదా! ఈబాలిక యుక్తవయస్కయైన నేనేమి చెప్పుదును? కన్య ప్రాయమెంతయని యడుగుట సహజము. తండ్రి పోయి యెంతకాలమైనదని యడుగుటయు సహజము. భర్తృమరణకాలమును బుత్రికా జననకాలమును బోల్చి సరిచూచినేని యపుడు దుష్ప్రతిష్ఠపాలుగానా? భర్తృమరణకాల వివరమైనఁ బొంకవలదనుగాని! ద్వితీయ వివాహవిషయము తప్పించుకొను టెట్లు? నిజము తప్పదు. ఈ బాలిక కిప్పుడే వివాహము సేయుదునా? ఈ వయస్సునఁ బరిణయమాడి తల్లియమ్మగ ననుభవించుచున్న యీదురవస్థ నాబిడ్డకుఁగూడ నలవడవలయునా? అమ్మా కాదా! నీముద్దుమురిపెములు చూచి యానందించు భాగ్యము నాకు లేదుకదా! » అని పలుగతుల విచారించు నొక వితంతువును దదుత్సంగోపవిష్టయగు నొక బాలికను నొక భోగాంగనగాంచె. ఆమె దీనాలాపంబుల నించుక వినియుండుటచే భోగాంగన యామెపైఁ గరుణించి యిట్లు సంభాషింపఁ జొచ్చెను.

భో.—అమ్మా మీదే దేశము?

—ఇచటి కనతిదూరమే!

—ఇచటికేల వచ్చితిరి? మీ తావును విడువ హేతువేమి?

—ఏమి చెప్పుదును? నేను బడిన పాట్లును నాకు ఘటిల్లిన యీదురవస్థలును రులతోఁ జెప్పఁగొనవలయునా? పొందిన యపయశస్సు చాలదా?

భో.—అమ్మా! నిర్విచారముగాఁ జెప్పుము. నన్ను వేరువిధముగా భావింపకుము

వి.—నేనీప్రాంతమునఁ గీర్తివహించిన యొక సోమయాజికుటుంబమున. కాలక్రమమును బట్టియు, నాచారధర్మములను బట్టియు దేశస్థితినిబట్టియు సోమయాజియగు మాతండ్రిగారు నాకైదవయేటనే వివాహముగావించిరి.

భో.—వివాహసమయమున నీభర్తయందు నీకేమైన ననురాగముండెడిదా!

వి.—వారెవరో నాకప్పుడేమియుఁ దెలియదు. నేనమ్మగారియందె మామక్కొని యా యన కెదమచేతి కైవుఁగూరుచుండెడిదానను.

భో.—చదవండి.

వి.—నన్నుఁ బరిపూర్ణ విద్యావంతుఁడగు నొక యవధానిగాఁకిచ్చి వివాహముచేసిరి.

భో.—అప్పటి కాయన ప్రాయ మెంత!

వి.—నూటికిఁ బదేండ్లుతక్కువ ప్రాయముగారు!

భో.—తరువాత నీభర్త యెంతకాలము జీవించెను?

వి.—ఎంతకాల మెక్కడిది? ఆసంవత్సరముగడువలేదు.

భో.—రామరామ: ఎంతమాట! అట్లయిన నీబాలిక యెవ్వతె?

వి.—నాపుత్త్రిక.

భో.—ఎట్లు?

వి.—తగుప్రాయమువచ్చి జ్ఞానవతి నైనంతపిదప మరల స్వయంవరము చేసికొంటిని. ద్వితీయభర్తవలనే పుత్త్రిక జనియించినది

భో.—తరువాత?

వి.—నా ద్వితీయభర్తయుఁ గొలదికాలముక్రింద గతించె. అప్పుడు నే నేదైన నొక పుణ్యక్షేత్రమునుండి దైవభక్తిచేఁ గాలముగడుపవలయునను నుద్దేశమునొందితిని.

భో.—అట్లయిన నీబాలిక నేమిచేసెదవు?

## నాలుగవ ప్రకరణము.
### విచారణ.

భో—అయ్యా మీరెవరు?

వి—నేను విశ్రమసింహపురవాసుండను.

భో—మీ యాగమన కారణమేమి? మీకేమి తగవు మంటిరి?

వి—నేను క్రొత్తగ ప్రవేశ పరీక్షలో నుత్తీర్ణుడనైతిని.

నాతండ్రి బాల్యమునందే గతించెను. అప్పటినుండి నాతల్లి నాయన్న కొంది జీవనముచే నన్ను బోషించి యింతవఱకు జదువు చెప్పించిరి. దైవసాహాయ్యమున ప్రవేశ పరీక్షలో నేను మొదటి తరగతిలో నుత్తీర్ణుడనయితిని. ఇక విశ్వ విద్యాలయమునందేర వాంఛ మెండుగ నుండుటంజేసి తమ సహాయ్యము వేడవచ్చితిని. ఇదియే నావృత్తాంతము.

భో—ప్రవేశ పరీక్షావిజయాపాదితమైనను మీకు మర్యాదలు తెలిసినట్టు కనబడదే? కాలిజోడునుం దీయకయే నాగదిలోనికి రావచ్చునా?

వి—అయ్యా భాగ్యహీనుని క్షమింపుడు అనుచు నావలికరిగి పాదరక్షల నచ్చట విడిచి తిరిగి ప్రవేశించెను.

భో—మంచిది. మీరే వర్ణస్థులు?

వి—అయ్యా! నేను బ్రాహ్మణుండను.

భో—బ్రాహ్మణుండవా? ఇట్టి బ్రాహ్మణులునుం గలరా?

వి—అయ్యా! అట్లనెదరేమి?

భో—(కోపముతో) ఓహో! నీకుం గారణములు తెలుపవలెనా; ఇటువినుము నీవేషము, నీకోడితల, నీయొడలికి నీచర్య మేనింజూడ గేవలము క్రైస్తవుండవుగ నగపడుచున్నావు. కాని బ్రాహ్మణుండవుగ గనుపడుటలేదు. ఎన్నడో నించుక యాంగ్లేయవిద్య నభ్యసించగనే గర్వాంధులై కులధర్మములమాని త్రుళ్ళిపడు హీనుల మోములనేం జూడనొల్ల.

నాయనా! యీవిషయమున నీవంతచింతింపఁబనిలేదు. మనకున్న యీయాస్తి యంతయు నీదేగదా! యీయాస్తియంతయు నీవిద్యకై వినియోగించుకొనుము.

అమ్మా! నీవట్టివెఱ్ఱివి! మనయీయాస్తివిక్రయించిన నెంతకాలమునకు రాఁగలదు? అపైన నీవెట్లు జీవించెదవు?

నాయనా! నేనెట్లయినను జీవించెదను. నీకు విద్యాసంపూర్ణ మగునంతవరకు నెటులైనఁగష్టించి—

ఎంతమాట! అమ్మా! నీవు మాటికిఁగష్టపడుచుండఁ నేవిద్యకుఁబోవలెనా? అట్టివిద్య లేకున్ననేమి? ఇంతకాలము నాకొరకై నీవుపడినయిడుములు నేనెఱుఁగుదును. ఇఁకఁ గూటికిని గష్టపడవలెనా? చాలును ఇట్టికర్ణకఠోరవాక్యములు నేను వినఁజాలను.

వీరియుభయులు దుఃఖాక్రాంతులై సంభాషించుచుండఁ దటాలున నింటిలోని కొక పురుషుఁడు ప్రవేశించెను.

---

## ఎనిమిదవ ప్రకరణము.

### బడిచెలిమి బలిమి.

సుందరుఁడు ప్రవేశపరీక్షావిజయమునకై ప్రయత్నించుచున్నవేళ నతనికి మదనుఁడను నొక సహాధ్యాయి కలఁడు. చిన్ననాఁటనుండియు వీరిరువురు నొక్కటిగ విద్య నేర్చుచునుండిరి. అందువలన వీరికిఁ బరస్పరానురాగము మెండై యుండెను. వీరిరువురును సమవయస్కులు. మదనుఁడు సింహపురీనగరమునకు సమీపమున నున్న చిన్నరాయపురంబను జనపదంబున నుండు నొక గొప్ప భూస్వామి పుత్త్రుఁడు. యితని తండ్రి యితని నతిబాల్యమునందే విద్య నేర్పించుటకొఱకు సింహపురనగరమునకుఁ బంపెను. అక్కడ నుండి యునితఁడును సుందరుఁడును నొకే విద్యాలయమునఁ జదువుచుండిరి. ప్రవేశపరీక్షయందు వీరిరువురు నొక సంవత్సరమున కృతార్థులైరి. పరీక్షకుఁ గొన్ని దినాలకు పూర్వమే యితని తండ్రి యాకస్మికముగఁ గాలధర్మము నొందెను. ఇతఁడు ప్రవేశపరీక్షయందుఁ గృతార్థుఁడైయున్నంతటఁ దనవ్యవసాయములఁ జూచు సహాయకారి లేమింజేసి యతిదుఃఖమున విశ్వవిద్యాలయమునకుఁ బోవు ప్రయత్నము మానుకొనెను. సుందరుఁడును రాజ్యలక్ష్మియు సంభాషించుకొనువేళ జరిగిన మనుజుఁడీ మదనుఁడే. మిత్రుని జూచిన నప్పుడు సుందరుఁడు దీనవిషాదము నాక్రమించి నవ్వు మనిట్లు ప్రసంగించెను.

మదనా! రమ్ము కూర్చుండుము!

సుందరా! యేమియిది నీ మొగమంతయు వాఁడియున్నది! ఈవిషాదమునకుఁ గారణ మేమి?

ఎన్నిటికైనను లేమిడియే కారణము అహా! అహో దారిద్ర్యము శాపమే కదా!

ఈ విషయమయి భావభేదములున్నవి నీకిప్పుడు కలిగిన కష్టమెయ్యది? సుందరుఁడు రాజ్యలక్ష్మియాదినమున జరిగినవృత్తాంతమంతయు మదనునకుఁ జెప్పెను. అతఁడదియెల్ల సావధానముగ విని మిత్రమా! నీవీ విషయమున నేదియుఁ జింతింపనక్కఱలేదు. నిన్న నేను గుర్తెరింగినదాదిగ సహోదరభావమునఁ జూచితిని గాని వేరొండుగాఁగు. రాజధానికిఁ బొమ్ము. విశ్వవిద్యాలయమునఁ జేరుము. నీకయ్యెడి ధనవ్యయమంతయు నేను భరించెదను. ఇట్లు చెప్పి సుందరుని కౌఁగిలించికొనెను. అతఁడు తలవాల్చి కృతజ్ఞతాపూర్వకముగ నిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

మిత్రమా! నీయౌదార్యమునకెంతయు నమస్కరించెదను. భూమ్యాకాశములును, సూర్యచంద్రులును, నా జననియు సాక్షిగ నేఁ జెప్పఁగలిగినదిదియే. నా విద్యాభ్యాసకారణుఁడ వగుటచే నీవే తండ్రివి. నీవే తోడువు. ఏకాలమునకైన నీవు నాకుఁ [illegible]

మేలునకుఁ బ్రతిసేయుశక్తియు నవకాశమును గలుగఁజేయఁ గలందులకై భగవంతునిఁ బ్రార్థించెదము.

పిమ్మట రాజ్యలక్ష్మీసుందరులచే దీవనలంది మదనుఁడు విజయపురమునకుం జనెను. కొలఁదికాలమునకే సుందరుఁడు రాజధానికిం జని విశ్వవిద్యాలయమునఁ బ్రవేశించెను.

---

## తొమ్మిదవ ప్రకరణము.
### దీనజనరక్షణము.

అయ్యో! అయ్యో! రక్షింపుడు. రక్షింపుడు.

ఛీ! మాలముండకొడుకా! నాదగ్గరనా టక్కులు? నాఋణమీక్షణమునఁ దీర్పుము లేనిచోఁ బనికిరమ్ము. అంతదనుక నేను నిన్ను విడువను.

మహాప్రభూ! నేను బానిసవాఁడను. నీచాకిరి చేయువాఁడను. దుస్థితి నొందున్న నన్ను శ్రమపెట్టిన నేను జత్తును. నాయందుఁ గరుణయుంచి నన్ను మన్నింపుఁడు.

ఛీ! పశువా! గాడిద! [అని రెండుగ్రుద్దులు గ్రుద్దెను.]

అయ్యో చచ్చితి. అయ్యో! చచ్చితి?

అయ్యో మాయయ్యను గొట్టుచున్నారు. మాయయ్యను జంపుచున్నారు. బాబా చంపఁబోకుఁడు. ప్రాణముతోఁ గదలుఁడు. మీఋణము తీర్చుకొని పోదము. నాయనని వదలుఁడు. మీకాళ్లు మొక్కెదము. అంతలోఁ బ్రవగమును గోదండస్వామియు నొకగృహమునుండి వెలువడె నప్పుడొకయువకుఁడు హయావరోహణము గావించి తటాలున నిలుసొచ్చెను. రక్తాక్తుఁడును దీనకాయుఁడును నగు నొకతరుణవయస్కుఁ డొకమాలని జుట్టుచేఁ బట్టిలాగుచుఁ గొట్టుచుండెను. ఆమాలఁడు క్రిందఁబడి వడఁకుచుండెను. అతఁడుతనకు రెండుచేతులను జోడించి రక్షింపుడు, రక్షింపుడు, అని యార్తనాదమున నెలుగెత్తి యేడ్చుచుండెను. చెంతనున్న శిశువు తల్లిపయింబడి పెద్దగ నేడ్చెను. అట్టియెడ నీయువజనుఁడత్యాగ్రహమునఁ గోదండునికరమును గట్టిగఁ బట్టి ఈక్షణమున నీమాలని విడువుము: లేకున్న నీప్రాణములు నీవిగావనుకొనుము అనెను.

కోదండుఁడు ఓహో! మీరావన్న దండిమనది! అనిహేళనసేయుచు నిట్లనెను.

ఓ యీరీకిచటఁ బనిలేదు. ఈమాలఁడు నాసేవకుఁడు. నావద్ద నప్పుపుచ్చుకొనినవాఁడు. కావున నేను దండించినను, ఖండించినను నీకు జోక్యము కలుగఁజేసికొన నవసరములేదు.

దుర్మార్గా నీకించుకయైనఁ గనికరము లేదా?. వ్యాధిగ్రస్తుఁడగు నీమాలవాని నకారణముగఁ జంపఁజూచితివే! ఈలోకమున లేకున్నను, పరమందైన నీయాక్రోశ్యమునకుఁ బ్రతిదండన లేదా!

అప్పుడు. ఈ వేదాంతములనిక నిలుపుము. ఈ గ్రామమునందున్న హీనకులస్థులందరును బోధించుటకుఁ గారణము నీవకదా! నీవు కులద్రోహివి. ఈ నీచునికొఱకై నన్ను నిందించుచున్నావు. ఇందులకు ఫలము శీఘ్రముగ ననుభవించెదవు.

నీ గంభీరవాక్యములనిక నిలుపుము. అసలు నీకేమి యీయవలయునో చెప్పుము.

నాకిఁక నూఱురూప్యములీయవలయును.

మాలఁడు. అయ్యా అన్యాయమువలదు. నేను మీయొద్ద దీసికొనినది యేబది రూప్యములే కదా? అందునకు పదివర్షములనుండి నా వేతనమున సగభాగము ఋణమునకై యిచ్చుచుంటినే! ఇప్పుడు నూఱురూప్యము లెటులయినవి?

కో. నోరుమూయుము. నాతో వాదించెదవా? నీవు నావద్ద గైకొనినది నూట యేబదిరూప్యములు. అందు నీపది వర్షములనుండి యేబదిరూప్యములు చెల్లుబడినవి. ఇంకను నూఱురూప్యములు నిల్చియున్నవి. కట్టివేఁగట్టుము. లేకున్న నీపై న్యాయ స్థానమున వ్యాజ్యమువేసి వడ్డీ ఖర్చులతోటి రాఁబట్టుకొనియెదను.

ఇది యంతయును విని కోదండునితో వాదించిన నిష్ఫలమనియుఁ దాఁ జెప్పినట్లు ఋణమునకై యొక్కరినేని కూటసాక్షులనియమింపఁ గలడనియు నెంచి యేవిధమునను దా నా కౌములకాతని పేరనొక పత్రము లిఖించియిచ్చి మాలని ఋణవిముక్తుం జేసి తన పరిచారకులలోఁ జేర్చుకొనెను.

---

## పదవ ప్రకరణము.

### ప్రమాదము.

వేణుగోపాలశర్మ కమలావిషయమై స్మరించినప్పుడెల్ల వ్యాకులపడుచుండెడివాఁడు. స్త్రీ స్వాతంత్ర్యమునకై కనుమూసియు విద్యగరపించి తనయిచ్ఛానుసారముగా నామె ప్రవర్తింపకపోయెనే! అను వ్యాకులత యతనినెంతో బాధించుచుండెడిని. తాను వయసునకాకెంత ప్రయత్నించినను దరా పావనముస్లథమగుటంజేసి కడుంగడు వ్యాకులపడుచుండెడివాఁడు. అదియునుంగాక ప్రాయమును మీరివచ్చుకాలమున వివాహవిషయమై తొందరపడుచుండెను.

కమలయిన కళాలంబున విద్యాభంగముగలిగినందులకు మిగుల జింతించి జనకుని యానతిమీఁద నింటిసేవలయు పుస్తకములదెప్పించి చదువుచు విద్యాభివృద్ధిచేయుచుండెను. స్వయంవరవిషయమున లోకాచారమునననుసరించి తండ్రిగారికి కష్టమయిన కొట్టులగునో యని యప్పుడప్పుడనుమానించినను వాలస్యమయినను తగువరునిఁబరిణయమాడవలెనని కమలయభిప్రాయము. జననీజనకులను గమలామనోభీష్టము బూర్తిగ నెరింగి పరికుండిరి. అన్యోన్యాభిప్రాయము లిట్లుండ నవి విశదీకరించుకొనుటకు నాఁడు వారిట్లు ప్రసంగించిరి.

వే. అమ్మా! నీకు వివాహము సేయుకాలము మించుచున్నది. ఇంక వాలస్యము చేసిన హానికలుగును నీకెవరినిజేపట్ట నభిలాషగలదో యది రూఢిచేసి చెప్పుము.

క. అయ్యా! నాకిప్పుడు వివాహప్రయత్నమేమి? ఇంకను గొన్నినాళ్ళు వేచియుండరాదా?

వే. అయ్యో! వయస్సుమించిన నాచారహానికలుగును పెద్దచిక్కులు సంభవించును. నీవు చిన్నదానవగుటచే నట్లనుచున్నావు నీవు నిరోధింపకుము.

రా. ఇంక నింతగా దొందరపడనక్కరలేదు. కావలసినవిషయములు జరిగినది ప్రతిష్ఠయో, అప్రతిష్ఠయో జరిగినయంశములనుబట్టియే రావలయు.

వే. అదియేమి? యేమిజరిగినదని యంటివి

రా. ఏమున్నది కమలతప్పు

వే. ఏమితప్పు మాలధరించుచున్నదా!

రా. తరువాత రహస్యముగఁ జెప్పెదనంటిరి

వే. నామనంబాఁగకున్నది. వినదగునేమి చెప్పుము?

రా. [రహస్యముగ] పునర్వివాహమయినది.

వే. హౌరా! ఎంత వైపరీత్యము.

రా. వెలువరింపక శాంతించి జరిగినది రహస్యముగనుంచుము.

క. అమ్మా నాకిక వివాహముమీద బుద్ధిపోవుటలేదు. నీవు తొలుత నిశ్చయించి నాతో రహస్యముగఁ జెప్పినవరుని నాకు లభింపఁజేసితివేని సమ్మతమే కానిచో నాకు వివాహము చేయ నక్కరలేదు.

రా. అమ్మా! అట్లనెదవేమి? అతనియందు మీతండ్రికిఁగల యిష్టము నీకుఁ దెలియదా? అతనికన్న నెక్కుడుధనవంతులును జదువరులును లేరా? తదితరులయందెవరి నైనను గోరుకొనరాదా?

కమల ఈవాక్యములనాలకించి విచారభావంబునఁ గన్నీరుఁగార్చుచు నిలువంబడెను.

వే. మనయూరనున్న విద్యాదీక్షితునికుమారుఁడు నృసింహరాయుని యందేమయిన సుగుణములున్నట్లాలోఁచునా?

రా. అవునవును. అతనికీర్తి జగద్విదితము. ఈవిషయమున నాకును సమ్మతమే. మనయభిప్రాయమిందేకీభవించినది. ఇఁక ననుమానింపకుఁడు.

వే. అట్లయిన నిఁక బంధుమిత్రులకాహ్వానము పంపెదను.

రా. అట్లేచేయుండు అదియె సత్కారము.

కమల. యీప్రసంగము విని యేమియు నెరుగనిదానివలె నటించి సమ్మతించె నా యనునట్లు ప్రవర్తించి వారి మూలనౌదాసీన్యమువహించెను. పాపము దీనదంపతులు కొమరితనునమ్మి వివాహప్రయత్నమునందుండిరి.

# పదునొకండవ ప్రకరణము.

## పంచాయతి.

విక్రమసింహపురమునకు కొంతిదూరమునన్న చిన్నరాయపురంబున నతిరమణీయమగు నొక్కదేవాలయముకలదు. విచిత్రములగు చిత్తరువులతోడ శోభిల్లుగోపురములతోడను, విశాలమంటపములతోడను, రజిత సువర్ణాద్యమూల్యలోహనిర్మితములగు వాహనములతోడను, మత్స్యములమెక్కి తిరుగాడు ఒక కొగందివాదుల విలాసకేళ్యాలోయమనొప్పు కలువలవికసించిన నటునిటునూగాడు వికచకమలకుసుమపుష్పములచే శోభిల్లుకొలంకులతోడను, కోదండరామనిలయాలయము చెలువారుచుండు. ఆయాలయమునెదుట విశాలములగు చలువరాలచే గూర్పబడిన యొకమంటపముగలదు. ఒకనాటి సాయంకాలమున నాదేవాలయముమంటపమున ననేకులుచేరిరి. ఎల్లజాతులవారు నాసభనలంకరించిరి. వీరందరునెద్దియో యొకవిషయమును గూర్చియిట్లుతర్కించుచుండిరి.

ప్ర. అయ్యా మశూచిదేవతయగు పోలేరమ్మకు జాతరజరిగి రెండేండ్లయినది.

ద్వి. అవును. ఈసంవత్సరము జాతరజరుపకున్నచో నీయూరుధ్వంసము గావించును. కావున జాతరజరిగి తీరవలయును.

తృ. అయ్యా! జాతరమహోత్సవముజరుపనెల్లరు నియ్యకొనినవారేగదా!

అవునవును. [అని అందఱునరచిరి.] అపుడాసభ్యులలో నొక యువజనుడు లేచి యిట్లుచెప్పదొడగెను.

సభ్యులారా! నేనిచ్చోట జేరినవారందఱికన్న జ్ఞానమునగాని, ధనమునగాని యెక్కువవాడనుగాను అయిన నాప్రార్థనము లాలకింపవలయును. మీరొనరించు మహోత్సవము నేనేమియు నాక్షేపించువాడనుగాను. మీరు తీరుమానించుభంగి నేనును నావంతుకప్పమునర్పింతును. జాతరకాలమున జరుగుకొన్ని ఘోరకృత్యముల నాపవలెనని నాప్రార్థన. ఆకాలమునజరుగు జీవహింసదలంప నామనంబెంతయు దల్లడిల్లుచున్నది. నిష్కారణముగ జంతుసంతానముల బహిరంగముగవధించు మనము మృగమాత్రులముగాని మనుష్యమాత్రులముగాము. హింసమిక్కిలిపాపకరము. పుష్పములతోడను, ఫలములతోడను బూజించిన నాకె తృప్తిపడదా? నామొరాలకించి యీఘోరకృత్యము మాత్రముమానిపించెదరుగాక అని ప్రార్థించుచున్నాడను.

ఈతనిమాటలను విన్నవారు కొందఱితనికిఁ బిచ్చియనియుఁ గొందఱితనికిఁ బొగరనియుఁ దూలనాడిరి. కొందఱతనిని పహసించిరి. కాని వారీతనియుద్దేశమున నంగీకరించినవారు లేరు. అందరును యథాపూర్వముగ జాతిర జరుపబడెననియు, భూస్వాములందరు దమకున్న భూములకొలఁది విత్తమీయవలెననియుఁ దీర్మానించుకొనిరి. కార్యనిర్వాహమునకుఁ గొందఱిసభ్యుల నేర్పఱచుకొనిరి.



# పండ్రెండవ ప్రకరణము.

## ప్రయత్న భంగము.

మంగళస్నానము లైనవా? వధూవరులఁ గైకొనిరండు.

మంగళాసనముల నమర్చితిరా? యూరిలోని పెద్దమనుష్యుల నాశీర్వచనమునకును దాంబూల గ్రహణమునకు నని యాహ్వానము సేసి వచ్చితిరా?

పెండ్లికొమారితె వారి యాహ్వానమైనది.

అలసింపకుఁడు వర్జసమయము వచ్చుచున్నది. వధువును ముందు గైకొనిరండు.

పదంపడి కొందఱు వధువుం గైకొని రాలోని కరిగిరి. వివిధములగు మధుర వాద్యములును, సంతోషసూచక వైవాహిక జనసల్లాపములును, ఉభయ పార్శ్వముల వింజామరల వీఁచు వేశ్యాంగనలును వెలుఁగ కళ్యాణధుర్యుఁడై మహావైభవమునఁ బెండ్లి కొమరుఁడు మామగారి గృహమునఁబడిన యాకైతవ వివాహసదనమును జేరెను. వివాహసుముహూర్త మాసన్నమగుడుఁ బెండ్లిపెద్దలఁదొందరసేయుచుండిరి. పెండ్లికొమరిత యింకను రాదయ్యె. ఆమెకొఱకై దాదులు గుఱిలెల్ల వెదకిరి. ఎచ్చటను గాన్పింపదయ్యె. ఈవార్త వేణుగోపాలశర్మగారిని జేర అతఁడత్యంత భయాక్రాంత స్వాంతుఁడై కొమరిత గదిలోనికిం జనియె. మఱల మఱలఁ దేరి పారఁ జూచుటయే గాని, యెవ్వరును గానరారైరి. తుదకామె పండిన సెజ్జపై నొకలేఖ గాన్పించెను. అద్దానిపై

నాయనగారగు వేణుగోపాల శర్మగారికి, అని వ్రాయఁబడియుండెను. అతి త్వరితముగ నాలేఖ నతఁడు విప్పిచదువఁ దొడంగెను.

జనకా! మీరు దలపెట్టిన యీవివాహము నాకసమ్మతము. పరిణయముగాక వయస్సు మీఱి మీయింటనుండుట మీకపఖ్యాతి. కావున మీగృహము విడనాడ నుద్యమించితి. నా స్నేహితురాండ్రగు కొందఱు క్రైస్తవ సోదరీమణుల సాహాయ్యమున రాజధానికిం జని యచ్చటనున్న యనాథస్త్రీజన శరణాలయమున కరిగెదను. నన్ను మృతిజెందిన దానినిబోలె నరసెదరుగాక. నన్నుఁ దిరిగి కొనవలెనని యెట్టిప్రయత్నము సేయుచున్నవారని విన్నను నేనాత్మహత్య గావించుకొని యసువులఁ బాపుకొనెదను. నన్ను క్షమింతురుగాక. మీకును నాప్రియమైన తల్లిగారికిని నావందనములు.

ఇట్లు మీ యనుంగు గూతురు,

కమల.

ఆహా! యేమి వైపరీత్యము? కల్యాణ గృహమిప్పుడు నిర్యాణ గృహముగమారెను. న్యాయవాదియుఁ దత్కామినియు నిశ్చేష్టులైచేరి యొకపార్శ్వమునఁబడి యుండిరి. పెండ్లికివచ్చిన బంధుగులెల్ల చెల్లాచెదరై వడలిరి. పెండ్లికొమరుండగు నృసింహారాయఁడు కళ్యాణ మంటపమున కెంత సంతోషమున వచ్చెనో యంత సంతాపమున వచ్చుటువానెను.



# పదుమూఁడవ ప్రకరణము.

## వేశ్యాగృహము.

ఒకనాఁటి సాయంకాలమునఁ జిన్నరాయపురమునఁ గోదండరాముని యాలయమునకు నుత్తర దిశయందుండు వీధి యందిరువురు పురుషులు ప్రాఙ్ముఖులై నడచుచుండిరి. వీధి యందు దేవాశ్రితులగు నర్తకులు మున్నగువారు కాపురముందురు. చీకటివేళ యైనందునను మొగంబులు తెలియరాకుండునటుల మేలిముసుంగులిడి యుండు కారణంబునను నాపురుషు లెవరైనదియు గుర్తింప వలనుకాకుండెను. వారిరువురు నొండొరు లేమియు సంభాషింపకొనక యత్యంత దూరము పోయి వీధ్యంతమున నొక యింటి వాకిట నిలువంబడిరి. ఆయింటి ద్వారము మూయఁబడియుండెను. చెంతను దెఱచియున్న గవాక్షమునుండి ప్రజ్వరిల్లు దీపపుగాంతి వెలువడుచుండెను. గృహాంతరమున నొకబాల మృదుమధుర స్వనాంచితముగ గానపేటికను వాయించుచు నందందుఁ బాడుచుండెను. వారిరువురిలో నొకఁడు ద్వారప్రాంతమునకేగి తలుపుదట్టుచుఁ "గోకిలా! గోకిలా!" అని మెల్లగఁ బిలచెను. లోనున్న యొకయువిద "ఇదిగో వచ్చితిని" అని చెప్పుచు నతిత్వరితముగ ద్వారముం దెఱచెను. వీరిరువురును లోనికిం జనిరి. ద్వారము మఱల మూయఁబడెను. ముంగిలి కూట మతిరమణీయముగ వివిధ శృంగార రసానుబోధకమ్ములగు పటములచే నలంకరింపఁబడియెను. నిర్మలములగు నరిపరిధానముల ధరించి, వివిధాభరణ భూషితయై మందస్మితాననయై కవాటము దెఱచిన యాయువతి ప్రౌఢాంగనగాఁ గనఁబడెను. గాన పరాయత్తచిత్తయగు నాబాలిక పీతాంబర ధారిణియై నవరత్నఖచితములగు నాభరణము లనేకముల ధరించియుండెను. పూర్ణేందు బింబంబును బోలిన యాబాలిక ముఖంబును గమనించుచుండ నెద్దిగారి యొక్క మనోవ్యాకులత యామెయెడ నగపడునుగాని యది సాధారణముగఁ గాన్పింపరాదు.

అయ్యలారా! కూర్చుండుఁడు. అని కోకిల స్వాగతముసంగ నాయిరువురు పురుషులు నున్నతాసనములఁ గూర్చుండి మేలిముసుంగులఁ దీసివైచిరి. వారిలో నొకఁడించుమించు ముప్పది ముప్పదియైదు సంవత్సరముల ప్రాయమువాఁడు. ఇతఁడు బ్రాహ్మణవంశ సంజాతుఁడుగ నగపడువాఁడు. ఆతఁడా యింటి వేశ్యయగు కోకిల విటకాఁడు. కాముండనువాఁడు. మఱియొకఁడు మదనికి విరోధియగు కోదండుఁ డీపురుషులిరువురును గృహమునఁ బ్రవేశించినది మొదలుకొని సరసవాక్య ప్రసంగము చేయసాగిరి. ఆముచ్చటల సంభాషణ మించుక [illegible] అపుడు నాయింటనున్న బాలిక విద్యానైపుణ్య మాపాదించి భరతాది కళావిశేషములయందు ప్రశంస గడించెనని కోకిల యుడివెను. అప్పుడు కాముఁడు కోకిలం బిలచి యేదో రహస్యముగఁ జెవిలోఁ జెప్పెను. అంతట కోకిల "ఏమే శారదా లోపల దాఁగు

# పదునాల్గవ ప్రకరణము.

## జనసేవ.

మన కథానాయకుఁడగు సుందరుని రాజధానియందు విశ్వవిద్యాలయమున విడిచితిమి. అతఁడచట వైద్యవిద్యయందు నవదినాభివృద్ధి గాంచుచు విజయోన్ముఖుఁడై యుండెను. ఆసమయమున రాజధానికి మహారాష్ట్ర దేశమునుండి యొక మహానీయుఁడు వచ్చెను. ఇతఁడు దేశసేవకై ప్రపంచ సుఖములెల్లఁ ద్యజించిన గొప్ప దేశాభిమాని. రాజధానియందితఁడు హైందవ జనసంఘ సంస్కరణ విషయమై యనేకములగు నుపన్యాసముల నొసంగెను. మనదేశమునందున్న వివిధ వర్ణభేదములను దేశక్షేమమునకు హానికరములనియు స్త్రీ పురుషులందరును సంఘ సంస్కారాభివృద్ధికై కృషిచేయవలయుననియు నానావిధములఁ నుపదేశింపఁ దొడఁగెను. ఏమి! వీరి యుపన్యాసముల మహిమ! వీరు రాజధానిని వదలిన కొలఁది దినములకే యచ్చోట సంఘసంస్కరణ సభలనేకములు నిర్మాణములయ్యెను. అందు దీనజనసేవక బృందమను సభకు మన కథానాయకుఁడు కార్యనిర్వాహకుఁడుగ నియమింపఁబడెను.

ఈ సంఘమునఁ జేరినవారందఱు జనసేవయే ముఖ్యమైన ప్రపంచవిధిగ నెంచి నిమ్నజనోద్ధరణమునకును, నానావిధవర్ణభేదభంగమునకును, స్త్రీజనౌన్నత్యమునకును పాటుపడుచుండిరి. ఉపన్యాసములవలనను, బోధనలవలనను వీరియుద్దేశములు వెల్లడిసేయుచుండిరి. వ్యాధిగ్రస్తులును, నన్నహీనులును నగు దీనుల యిడుములఁ బాపుట వీరివిధి.

ఒకనాఁటి యుదయమున సుందరుఁడు నిమ్నజనఘట్టమునకుఁ జని యచ్చోటి బాలురకై తన సభవారివలన నేర్పరుపఁబడిన పాఠశాలం బరీక్షించి మరలుచుండఁగా నొక యువతీమణి చెంగటనున్న యొకగృహమునుండి వెలువడెను. ఆయువతికిం బదునెనిమిది యేండ్లప్రాయముండును. ఆయువతి జగన్మోహనాకారమును, నౌదార్యమును, గాంచి సుందరుఁడచ్చెరువంది కొంతతడవు నిలువఁబడెను. సుందరుని గాంచినంతనె యాసుందరీమణి మిగుల లజ్జావిస్మయములనంది తలవంచెను. కాని యాయువతి యెవ్వతెయో సుందరునకుఁ దెలియదు. ఆజవ్వని కొంతదూరమేగినపిదప సుందరుఁడామె త్రోవనే పోవసాగెను. వారిరువురకును నించుమించు పదిగజముల దవ్వుండవచ్చును. అట్టితఱి హఠాత్తుగ నొక స్వాగమనశకటము వేగమున రాఁగా నాకామిని యటునిటు పోవఁజూచెను గాని తడవుచేయుటంజేసి యాశకటమా సతిం ఢీకొనెను.

హా! సుందరా! అని అఱచి యామె యాక్రోశముఁ బ్రకటించెను. ఈవిస్మితు నరయుఁడు. సుందరుఁడు సతికడకుఁ బరుఁగిడి కనుగొన నామె శవాకృతిగనుండెను. నోటరక్తము వెల్లువగఁ బ్రవహించుచుండెను. ఆశకటము నచట నిలువఁబడెను. పలువురచ్చటఁ జేరిరి. చెంతనున్న బాలికలవలన నాపె అనాథస్త్రీ శరణాలయమునందు సోదరీమణులలో నొక్కతెయనియు, రోగులసంరక్షణము కొఱకు దినదినము నొనర

## పదియాఱవ ప్రకరణము

### వేశ్యమాత.

శారదా! ఈవస్త్రములు బాగుగనున్నవా? ఇవియెంత ఖర్చు? ఏమాటకును బదులుపలుకవేమే? వాండ్రొసంగిన ధనమువెచ్చపెట్టి నీకామాల్యవస్త్రాభరణముల ను తెప్పించితిని. ఇప్పటికైననోఁ దృప్తిచెందుము.

వస్త్రాభరణములకేమిలే?

ఏమమ్మా! వగపునకుఁగారణము?

లేదా! కన్నతీకము?

ఎంత టక్కులాడివే? అన్నిసంగతులు నాకుఁబ్రక్కఁ జూచుచునే యేమియుఁ దెలియనట్లు నటించెదవు!

అమ్మా! నాకు దేహముస్వస్థతగాలేదు. ఇంకఁగొన్నినాళ్లు పోవలయు నుగదా?

శారదా! ఇప్పటికినిన్ను బదునాలుగేండ్లు సాకితినిగదే! యింకనెంతకాలము నీకొఱ కై కష్టపడఁగలనే? (కన్నీరు గార్చును.)

ఇంతకాలము నామనోభీష్టము నీకెఱింగింపక యూరకుంటిని. ఇంక నీవు నావ్యాకులత భరింపఁజాలను. అమ్మా! ఈవేశ్యావృత్తియందు నాకిష్టములేదు. నన్నొకనికై నొసంగి పరిణయముగావింపుము.

ఎప్పటినుండి నీకీరోగము పుట్టినదే? విచ్చలవిడిగ నీకిచ్చవచ్చిన విటకాండ్ర మచ్చికలచే మెప్పించి యిచ్చవచ్చినయట్లు విహరింపక నొకనిచ్చాగాని జేపట్టనిచ్చగిం చెదవేలనే? ఈపెండ్లిదవము విడనిలుపుము.

శ్రీనికైన సంప్రదాయసిద్ధముగానుండుటకన్న బిచ్చగాని సుధర్మపత్నిగా నుండుట మేలు. ఈవిషయమై యెంతయో యాలోచించితిని. లజ్జావిహీనమగు నీవృత్తి రతీవనమెంతయు హేయము. నాకు ధనములక్కఱలేదు. వస్త్రాభరణములక్కఱలేదు. శరీరకష్టముచేఁబ్రతికెదను. నాయందు కనికరముంచి నాకుఁబరిణయముగావింపుము.

[గద్గదస్వరముతో] అయ్యో! నీకెట్టిదుర్బుద్ధి పుట్టినదే! అని శారదంగౌగిలిం

## పదియేఁడవప్రకరణము.

### అజ్ఞాతానురాగము.

అమ్మా! యామె కీనాఁడెట్లున్నది?

గతదినమునకన్న మేలుగానే గానవచ్చుచున్నది?

ఇఁక భయములేదు.

అయ్యో! అట్టిభయమేమైన నున్నయెడల శతకోటిపాతకములకు నే గతించె ? . మనస్సుకూడ వచ్చెడిదా?

పాపము ఏమివైపరీత్యము! ఔషధసేవలో మిన్నయై పరోపకారదీక్షాపరతంత్రయై యనాథజనశరణాలయమునకు సహాధర్మ్య మాలోచనసేసిన యమలత్వభావ కిట్టి దురవస్థ సంభవించుటా! సోదరీ యీ యాలయమునకు నధ్యక్షత యేమవనిది!

ఈమెదే

ఓహో తద్గుణములు నీమె చారిత్రములోనివేనా? ఈమెతోఁ గొంచెము ముచ్చటింపవలయును. నిదురపోవుచున్నదియా? లేక యాయాసమున నట్లుపడియున్నదియా?

నేను మేల్కొల్పెదను. నిద్రపోవుచునే యుండవలె. అమ్మా! అమ్మా! అయ్యగారు వచ్చినారు.

ఆయువతి యప్పుడు నిదురమేల్కాంచి సెజ్జవిడచి నమస్కరించి యిట్లు సంభాషించెను.

ఆర్యా! మీసాహాయ్యమున నేటితో నాకు శరీరముల్ల స్వస్థత చెందినది. అనందము. నాకు మహోపకారము సేసితిరి. అనేక వందనము లాచరించుచున్నదానను.

నీవు సాధించు వందనములకు నేనర్హుఁడనుగాను. అంతయు సర్వేశ్వరుని సాహాయ్యమే.

అయ్యా! నేను గతదినమున సెలవిచ్చినరీతి నీనాఁడు సముద్రతీరమునకుఁ బో

వరకును నిశ్చయించుకొనినదానను. నిజమిత్రుల మాటన్నదయినది. తమరుకూడ విచ్చే సెదరని నా ప్రార్థన.

ఇంతకన్న సుఖదినమున్నదా! అటులనే పోవుదము.

పదంపడి యువపురుషుడు బరిచారికను వెంటఁగొని సంద్రంబు తీరంబునకరిగి సాయంసమయము ఆసన్నమగుచుండుటచే సాగరముఁ గలకలము మీఱుచుండెను. సకల జీవకోటుల కాధారభూతుండును కర్మలోకములకుఁ దేజఃప్రదాయకుండును, సర్వాంతర్యామియు: సకలగ్రహోద్ధతుండును, నగు భానుఁడస్తాంబుధిఁ గ్రుంకుచుండెను. తైక్ష్ణ్యహీనములయిన భానుకిరణములచేఁ బ్రపంచమెల్ల మనశ్శోభంగాంచెను. వివిధ వాహనారూఢులై యేతెంచిన జనంబులు తమవాహనముల చెంగటనిలిపి యపారపారావారతీరమున నటునిటు తిరుగుచు నానందించుచుండిరి ఎల్లజాతులవారు నాతీరమునఁ గాన్పించుచుండిరి. స్త్రీ పురుషులు విహారార్థమై పులినంబులఁ బ్రాలి యుండో ములు ముచ్చటించుకొనుచుండిరి.

విద్యార్థులకొందఱచ్చోబఱుండి తమతమ పాఠములఁ బఠియించుచుండిరి. బాలుర కొందఱు నీటియందుదిగి చిన్ని చిన్ని యలలస్పర్శమున నానందించుచుండిరి. అచ్చోటి వారిమొగములన్ని నానందము వెల్లివిరియుచుండెను.

మనశ్శృంగారనాయికా నాయకులొక్కచోటఁ బులినతలమునఁ గూర్చుండి తనువున సంభాషింపఁదొడంగిరి. అయిద్దఱియందును సంభాషించులక్షణములను నప్పుడప్పుడు కావించు మందహాసములును నచ్చోటియుగాడుజనములకభినవమార్గావలంబులగు దంపతులోయనునట్లు తోఁపఁజేయుచుండెను. భానబింబము వరుణాంబుధిలో మునింగెను. కొలఁది కాలమునకే యచ్చటివారనేకులచ్చోటు వదలి తమతమ గృహముల కేగిరి. నిర్మలమగు నాకసమునఁ బరిపూర్ణ తేజమున జాబిల్లి రాజిల్లెను. చల్లనితనకరములచే నెల్లవస్తువులఁ దెల్లఁ జేయుచు నల్ల నల్లన పేతెంచుచు జాబిల్లిఁ జూడ నెవ్వని యుల్లంబు రంజిల్లకుండు. సాగరంబును దుహినకరప్రభావమునను పొంగె. పేరలలచే భీకరారావము సేయఁదొడంగె ఇట్టి యాహ్లాదవేళ మన నాయికా నాయకులకే యననేల? శృంగారవిహారము గావించు నెవ్వరికైనఁ బ్రసన్నానురాగముద్భవిల్లకుండునే?

## పందొమ్మిదవ ప్రకరణము.

### వాగ్దానము.

నేనొక విషయము నిన్నడుగవలెనని యనేకదినములనుండి తలపోయుచుంటిని గాని మనకిరువురకును దృఢమైత్రి లేనికారణమున నూరకుంటిని. అద్దాని నిప్పుడైనడుగ వచ్చునో లేదోయని నామనము చింతరవందర యగుచున్నది

సంకోచింపకుము. నీవే నాయొద్ద రహస్యము వెల్లడింప సందేహించుచుండెదవు. నీకు నాకు నిజమైన ప్రియులెవ్వరున్నారు? సత్వరముగ నడుగుము. తొలుత శకటాపఘాత సమయమున సుందరా! అని అంటివి. అతఁడే వీఁడు.

నేనట్లంటినా! [అనిలజ్జావిస్మయంబులఁ దలవాంచెను.]

అవును. అంటివి. ప్రాణాపత్సమయమున నిన్నుగాపాడిన దెవ్వరు?

ఆధన్యుండిచట నాచెంతనున్న సుందరుఁడే.

తొల్లినట్లు శకటమైచినపుడుద్దేశించిన సుందరుఁడును నిప్పుడు నీ చెంగటనున్న సుందరుఁడునొక్కఁడేనా?

ఒక్కఁడే యయియుండవచ్చును.

ఇంకను సందేహమా?

సందేహమిప్పుడు విడిచితి?

నీతండ్రి యెవ్వఁడు?

వేణు—— అనిచెప్పునంతలో సుందరుఁడు వివశుండయ్యెను. అదిగ్రహించి కమల యతనితోనిట్లు ప్రసంగించెను.

అయ్యో! వెనుదీసెదవేమి?

వేణుగోపాలశర్మయని చెప్పెదనేమోయని భయపడితిని.

అటయిన భయమేమి.

## ఇరువదవ ప్రకరణము.

### కన్యాటకము.

కోకిలా నిర్దిష్ట నిశ్చితముహూర్తకాలము సమాసన్నమయ్యెను. వేశ్యమాత బంధువర్గములనెల్లఁ బిలిచి విందులఁ గావించెను. సాయంకాలమున చామనచాయ దేహమువాఁడును, చక్కఁగ గత్తిరించఁబడిన సన్నని మీసమువాఁడును నగు కళ్యాణమూర్తి యగు కోదండుడు నిమదలగు కుటులు మెడలపైబ్రాలఁ జక్కఁదిద్ది చెంగావి పంచల చంగమున ధరించి యొక ధవళాంబరము వల్లెవాటుగ వైచికొని యొయ్యారముగఁ గోకిలాగృహము నేరెను. ఆగృహ మతిరమణీయముగ నలంకరింపఁబడెను. పచ్చనియాకుల తోరణము లన్ని ద్వారముల వలరారుచుండె. కుడ్యములెల్లఁ జిత్రకాదీపితములయ్యెను. అహో! వేశ్యాంగన శయ్యాగృహము రామణీయకము! ఒక రసికుఁడు గదిలోనికిఁ బ్రవేశించునంతనె నలువురు రసికులగుదురా!" యన్న చందమునఁ దోఁప నలుదెసల నిలువుటద్దముల సౌరును, శయ్యాస్థలమునఁ బందుచో నేవెసఁజూచినఁ గృష్ణలీలా సూచకములగు పటముల చిత్రములును నెట్టి యమాయకునకును ప్రోత్సాహము గలుగఁ జేయకమానవు. శారద వివిధాభరణభూషితయై శయ్యాగృహమున నమర్చిన యాసనమునఁ గూర్చుండెను. కోదండుఁ డత్యానందభరితుఁడై కూర్చుండి యుబ్బుటలూఁగుచుండెను. అతనిమిత్రుఁడగు బాణుండును వానివెంట నిలువంబడియుండెను.

అప్పుడు దేశికులు శృంగారవనితలు పాటలఁ బద్యములఁ బాడుచు మంగళహారతుల నొసంగుచుండిరి. అచ్చటివారెల్ల సానంద జనిత కోలాహలమున నుండు సమయమున నలుగురు రాజభటులును నొక రాజోద్యోగియు నావేశ్యాగృహమునం బ్రవేశించిరి. వారిని జూచినంతనె గృహములోని కోలాహలమెల్ల నడఁగె. వారందఱు దిగ్భ్రమనొంది యేమియుఁదోఁచక నిలిచినవారైరి. రాజోద్యోగి యపుడు "కోకిలయు, బాణ కోదండులును, రాజాజ్ఞానుసారముగ ఖయిదీలు రేదిరండు" అనెను. వేశ్యాగృహసమాగత బంధువర్గములత్యార్తి చెంది తమోదవోపాయముల నూహింపసాగిరి. ఆవ్వేళ నాయింటఁజరిగిన కల్లోలము వర్ణనాతీతము. శారదపైఁబడి కోకిల "ఓసీ ఘాతుకురాల! ఎంతద్రోహముఁ దలంపు దలంచితివే!" అని యామెను గొట్టఁబోయెను. బాణుని సంతోషోత్కృష్టత విచార విశేషముగమారెను. కోదండుని మోమున నెంత వెదకినను నెత్తురుచుక్క లేదయ్యె. ఎట్టకేలకు రాజభటులు బలాత్కారముగ నా కోకిలను బాణకోదండులను గూడ గృహము వెలువరించిరి. బాణకోదండులకుఁ దమ సహజవిరోధియుఁ దొలుతటినుండియుఁ దమ్ముఁ బరాభవించుచున్నవాఁడును నగు మదనుఁడు మాటిమాటికిని జ్ఞప్తికి వచ్చెను.

పదంపడి శారద తనకు దుష్టులగు నా విటకాండ్రనుండి శాశ్వతమైనయిక్కట్టు

# ఇరువదియొకటవ ప్రకరణము.

## ఉపదేశము.

మదనుని వృత్తాంతమంతయుఁ జెప్పియుంటిని. నివాససౌధమునందము నిప్పుడు చూడుట యావశ్యకము. మదనుని నివాససౌధము చిన్నరాయని పురమధ్యమునందున్నది. అంబరచుంబితంబులగు బహిఃప్రాకారములఁ దాఁటి లోనికిఁ బ్రవేశించినంతనే చిత్రములగు చిత్తరువులచే నింపఁబడిన కవాటములవలనఁ ద్వారబంధములు గాన్పించును. లోపల విశాలమగు ముంగిలితోటయును, దక్షిణప్రదేశమునయున్న యనేకవిధములయిన యాసనములును కుర్చీలును సోఫాలును మంచములును నమర్పఁబడియుండెను. ఆకూటస్థానమునుండి పెక్కుగదులకు ద్వారములమర్పఁబడియుండెను. సౌధమునకు వెనుకప్రక్క వంటశాలయొకటి ప్రత్యేకముగ నిర్మింపఁబడియున్నది. ముందరిపార్శ్వమున వాహనశాలయొకటి గలదు. అందొకప్రక్క నశ్వములుండును. మఱియొకచెంత నశ్వశకటములుగా నయ్యెడిని. మఱియొకశాలయందు వృషభమహిషాది పశుగణములుగాఁగను ముంగిలి తోటమునుండి సౌధోపరిభాగమునకుఁ బోవుటకు సోపానములమర్పఁబడియున్నవి. సౌధశృంగారమత్యద్భుతము. చుట్టును ఘనచిత్రకారులచే గవిచిత్రపటములమర్పఁబడియున్నవి. అచ్చటచ్చటఁ గృష్ణమృగచర్మములు గోడలయందు వ్రేలాడుచుండెను. నేలఁ జిత్రితములగు రత్నకంబళములును, వ్యాఘ్రచర్మములును, బఱచబడియున్నవి. పెద్దగు గవాక్షములకు వివిధవర్ణాంచితములగు తెరలమర్పఁబడియుండెను. కోకిలయింటఁ జరిగిన కలహము మఱునాటియుదయమున నీసౌధమున మదనుండును మఱియొక సతీరత్నమును వసించుచుండిరి. ఈసతికి నలువదియేండ్లప్రాయముండును. పెనిమిటిమృతినొందినదాదిగ నామెయు వ్యవహారములన్నిటిఁ గుమారునకొప్పగించి దైవపూజావ్రతములఁ గాలముగడపుచుండెను. ఈమె మదనునిజననియగు కౌసల్యకాంబ. ఆతఁడు నమస్కరించునప్పుడెల్లఁ గుమారుని శ్రద్ధతో నాశీర్వదించుచు బుద్ధులు గఱపుచున్నది. అహా! మదనునకెంత మాతృభక్తియున్నది! మదనుఁడు దక్క వేఱొండు సంతతి లేమిం జేసి యామె యతనియందింత ప్రేమాతిశయము చూపుచున్నది.

నాయనా! నీవొంటరివాఁడవు. గ్రామమైనఁ గడువగునా? చుట్టుప్రక్కల నిగసనము సేయఁదగునా? ఊరిపోక లెట్లుండిననేమి!

అమ్మా! నెవ్వరిని దూషించితిని? నేనెవ్వరిని దండించితిని! నిరాధారుల రక్షించిన నేరమొకప్పటిదక్క నేకష్టమైనను వింటివా?

శాస్త్రపురాణసమ్మతమగు ధర్మాచరణమనల్పఘనీయమయినను దేశకాలపాత్రములనుగూడఁ జర్చింపవలయును. నీవు బాలుడవు ప్రపంచజ్ఞానానుభవము లెక్కుడుగఁ గలవాఁడవుగావు నేను పెద్దదానిని మదనా! నీవుదక్క నాకు వేఱొక యా

లేదు. తండ్రీ! నన్నుఁగాపాడించి మీగ్రామవైరము మానుము. శీఘ్రముగఁ జరిగినది మాని వంశముద్ధరింపుము.

అమ్మా! పితృమరణమునకుఁ గారణమైనవారి మాటాడెదవేమి! నిరపరాధినగు నన్నువారెట్టి యిడుములఁబెట్టిరి? ఎన్నివ్యవహారముల నన్ను నిర్బంధించిరి? దైవసాహాయ్యము లేకయున్న నాగతియేమైయుండును? వారివారిదుష్కార్యములకు వారే ప్రతిఫలము ననుభవింపక తీరునా! నేను దైవమును నమ్మినవాఁడను. ఎన్ని యిడుములు గలిగినను, నెన్ని యిక్కట్టులు రానున్నను, ధర్మమార్గము విడచి యధర్ములను, నజ్ఞానులను నగు కూళలు నడచుమార్గము త్రొక్కనోప మతిచిన్నప్పటి స్థితినిబట్టి వివాహమున నా మనము పొందకున్నది. ఇఁకఁగొన్ని నాళ్ళు జరుగనిమ్ము. పదంపడి నీయిష్టానుసారము జరుగఁగలదు.

రా—అవునురా మాబ్రాహ్మణార్థమువారు భిక్షచేయించిన వింతయే. నిన్నటిదినము వేణుగోపాల శర్మగారియింటిలో నెంత తృప్తికరముగా నున్నదిరా? పడిలో మునిగి నేతిలోఁ దేలితిమిగదరా!

గో—అవును. ఒక్కొక్కటి లడ్డుండ నారికేళ ఫలప్రమాణమురా!

రా—పాయసమెంత దివ్యముగా నుండినదిరా!

గో—రామకృష్ణా! ఎచ్చటను జెప్పకుము. నేను బదునైదు పంచపాత్రల పాయసము త్రాగితిని. మఱల శర్మగారి యింటిలో భిక్ష లేదటరా?

రా—ఓరీ! వెధవా! నీవు వట్టివెఱ్ఱివే? రేపు శర్మగారి భిక్షయైనసంగతి నీకుఁ దెలియదఁటరా?

గో—రేపేనఁటరా? ఇప్పటికే నాకజీర్ణదోషము మెండుగ నున్నయటులున్నదే? రేపేమి తినఁగలనురా?

రా—నీవు నపుంసకుఁడవు. ఇటువంటి భిక్షలు నాకయినను నేను పరకుసేయను.

గో—నీవు మొనగాఁడవేగాని శర్మగారెందరురా యిన్నిభిక్షల నిచ్చుచున్నారు? ఇప్పటికే వారైదు భిక్షల నిచ్చిరి. ఇంక నైదుభిక్షల నిడెదరఁట.

రామ—ఎందుకా? దేశాంతరము చనిన యాయన కుమారుని కులములోఁ జేర్చుకొనుటకు లేనియెడల శర్మగారా యిటుల సెలవుసేయునది?

గో—అట్లయిన శర్మ కుమారుని స్వాములవారు సంఘములోఁ జేర్చుకొన్నారఁటరా?

రా—ఇంకను విష్ణుశర్మ రాలేదుగదరా? వారేమో రాఁబోవుదురట వచ్చిన వెనుకగదా యది తీర్మానమగుట.

గో—ఎందుకుఁ జేర్చుకొనఁగూడదు?

రా—ఎందుకా? మందుకు. నీకెందుకురా! యీ యధిక ప్రసంగము?

గో—శర్మగారి కూఁతురు కమలయిచట నున్నదిరా?

రాము—ఏటిలో అదృష్టవిచారము నీకేలరా? ఇఁకఁ బ్రొద్దయినది. పోవుదము లెమ్ము. అజీర్ణ హారమునకు నాయొద్దఁ గొన్ని ఘుటికలున్నవి. మాయింటికి రమ్ము నీకొక మాత్ర నిచ్చెదను. దానిని మ్రింగినం రేపటిభిక్షకు సిద్ధముగ నుండఁగలవు.

ఇట్లు సంభాషించుచు నాతిండిపోతు లిరువురు నాపంచవిడిచి చనిరి.

———(౦)———

## ఇరువదిమూడవ ప్రకరణము.

### మంత్రము.

హిందూమత సంరక్షకులును, వేదవేదాంతోద్ధారకులును, జగద్గురువులును నగు శ్రీశంకరుని పీఠములు దేశము నలుదెసలఁగలవు. అందు వేదగిరిపీఠము సింహపురమునకవలిదూరమున నుండెడిది. ఈప్రాక్కాలమున నీతివిద్యావిశారదుండును, నైష్ఠిక బ్రహ్మచారియు, వదాన్యాగ్రగణ్యుండును, దానకర్ణుండును, నగు నొకమహనీయుండా పీఠము నలంకరించుచుండెను. వేణుగోపాలశర్మగారి ప్రేరితమున సింహపురవాసు లాయాచార్యులవారి నామంత్రణమునను సపరివారముగ వారు సింహపురికేతెంచిరి. సింహపురివాసులా మహనీయు నెంతయు గౌరవమున నాదరించిరి. బ్రాహ్మణులును శూద్రులును, వైశ్యులును ననేకభిక్షుల నొసఁగుచుండిరి. గొందఱియిండ్లను ధనికులుగాని వారలొకరికన్న నొకరెక్కుడు డాంబికమున భిక్షలనీయఁదొడఁగిరి. అనేకులు పాదపూజకై యాస్వాములవారిని దమగృహములకుఁ గొంపోయి యనేకవిధములఁ బూజించి కట్నములనొసంగుచుండిరి.

విప్రకుమారుల సంభావన జరిగిన మఱుసటిదినమున వేణుగోపాలశర్మగారి యింట నాఁటిభిక్ష జరుగనాయెను. సూర్యోదయమునంతనె ధవళాశ్వములను గజములను నొంటెలను నెక్కి శంఖాలవాయింపఁ బలువిధములగు వాద్యవిశేషములు దిక్కులం దిక్కటిల్లఁ వేదపారాయణముసేయు బ్రాహ్మణులు వెంటఁజనుదేర స్వాములవారు నవరత్నఖచితములగు కిరీటములను, భుజకీర్తులను, మణిగణముల హారములను, పీతాంబరములను ధరించి యతిరమణీయముగ నలంకరింపఁడిన పల్లకియందు సుఖాసీనులై స్వాములవారత్యంత వైభవమున శర్మగారియింటికిం జనెను.

దారియందంతటను జనులుగుంపులుగూడి స్వామిముఖసందర్శనము గావించుచు కృతార్థులగుచుండిరి. శర్మగారి సదనముఁ జేరినంతనె వారలతి వినయమున నెదురుగ నేతెంచి స్వాములవారి పాదములఁగడిగి తత్పాదస్పర్శమునఁ బవిత్రీకృతములయిన జలములఁ దమ తలపైఁ జల్లుకొని, యతిభక్తియుక్తముగ నయ్యాచార్యు నుచితాసనాసీనుం గావించిరి. శర్మగారి బంధుమిత్రవర్గము లెల్ల నచ్చోటికి విచ్చేసి స్వామివారిం బూజించి కృతార్థులైరి. నాఁటిమధ్యాహ్నకాలమున జరిగిన భిక్షావైభవమును వర్ణింప నెట్టివారికిని నలవిగాదు. శర్మగారు ప్రయాసమునకును నెలవునకును వెనుదీయక భిక్షం జరపించిరి.

భోజనానంతరమున నతిథులెల్లరును సంతృప్తులై నిజనివాసములకేగిన పిమ్మట మూఁగిలికూటమున స్వామివారు సభదీర్చిరి. ఆసభయందనేకులు పండితాగ్రేసరులగు విప్రోత్తములు చేరి శాస్త్రపర్యాలోచనము సేయఁదొడఁగిరి. ఆసమయమున వేణుగోపా

లక్ష్మిగారును, మఱియొక పురుషుఁడును కొంతసన్న మఱియొకగదియందాసీనులై యుండిరి. ఆపురుషుఁడు రత్నఖచితములగు మణికంకణములను, కుండలములను ధరించి విలువగల జరీవస్త్రములచే నలంకృతుండైయుండెను. అతఁడు ప్రాయము చెల్లినవాఁడుగనుండెను. వారిరువురును తాంబూలము వరించిన వెనుక లక్ష్మిగారాపురుషునిగని చిఱునగవుతో నిట్లనెను. దివాన్ జీగారూ! కార్యార్థినై మిమ్ముల నాశ్రయించినవాఁడను ఎటులనయిన నాకభయవాక్యమిత్తురని ప్రార్థించెదను.

దివాన్. ఈవిషయమున మీరంతగఁ బ్రార్థింపనక్కఱలేదు. అవకాశమున్నంతవఱకు మీకుసాహాయ్యము సేయ సిద్ధముగనున్నవాఁడను. మీకోరికల సెలవిండు.

వేణు. ప్రథమమున దేశాంతరస్థుఁడగు నాకుమారునిఁ గులమువనాంతఃశీక సన్మానింతురని ప్రార్థించెదను.

దివాన్. అతఁడిపుడెచ్చట నున్నవాఁడు?

వేణు. ఆంగ్లేయదేశమున వైద్యవిద్యను బరిపూర్ణముగఁ గ్రహించి గొప్పరాజకీయోద్యోగమును సంపాదించి మనదేశమునకు రానున్నవాఁడు కతిపయ దినములకాతఁడిచ్చో నుండఁగలఁడు.

దివాన్. ఇదిమిక్కిలి సుఘటమే?

వేణు. తమదయ.

దివాన్. [కొంతతడవాలోచించి] రాజకార్యార్థమై యన్యదేశములకుఁ జనువారికి మన్ననగలదు. ఆయాధారమున మీకుమారునికొఱకు నావలనైన శ్రమపడెదను. అయిన నీవిషయమున స్వాములవారి చిత్తమెటులుండునో!

వేణు. మీరు మనసారజేయఁదలచిన నిదియొకపనిగాదు.

దివాన్. తమరెండవ యభీష్టమెద్ది?

వేణు. నావిరోధియు, మత్సంసారభంగమునకుఁ గారణభూతుండును నగు సుందరుఁగుల భ్రష్టుంగావించుటయే నా రెండవయభీష్టము.

దివాన్. మత వైరుధ్యంబుగ నతఁడొనరించిన యకార్యమెయ్యది?

వేం. ముగ్ధయగు బాలికను పరిగ్రహించుటయే!

దివాన్. అందుకు సాక్ష్యము?

వేం. ఇదిగో! వారిపుర రాజధానియందు దేశాంతస్థలములయందు విరమించుచుండెఁ బాలవివాహస్నేహితులు వ్రాసినలేఖనము లివి. అని యాలేఖలను దివాన్ గారి చేతికందిచ్చెను. దివాన్ జీగారాలేఖలఁ జదువుకొని కొంతతడవాలోచించి ఇయ్యది సందేహాస్పదము; కర్తవ్యము విచారించెద. నని యాలేఖనములఁ గొలంబూని యాగదినుండి యరిగెను. వేంకోపాలశర్మయుఁ గొంత తడవాఁగి స్వాములవారి సభఁ జేరెను.

సాయంకాలమగునంత స్వాములవారితివిథవమున శర్మగారిగృహమువిడిచి తన విడిదిగృహమునకుఁ బోయెను.



## ఇరువదినాల్గవ ప్రకరణము.

## ద్వేషము.

ఇట్లుండ నత్యంత విభవమున స్వాములవారు సింహపురియందున్న సమయమున సుందరుని తల్లియగు రాజ్యలక్ష్మికి దేహమస్వస్థమై మిక్కిలి బాధగలిగెను. ఈసమాచారము మదనునకుఁ దెలియ నాతఁడు సింహపురికిం జని యామెకెన్నియో యౌషధములు నిప్పించెనుగాని యామెకు వ్యాధి ప్రబలమయి ప్రాణము దక్కుటయే యనుమానముగనుండెను. అట్టిసమయమున నాయమ తనకుమారుఁ జూడ నిచ్ఛ యొనరింప మదనుఁడు సుందరునకుఁ దంతివార్త నంపెను. తల్లికిఁ గలిగిన యాపదకు సుందరుఁ డెంతయుఁ జింతిల్లి యేకాకిగ సింహపురమునకుఁ జేరెను.

తల్లి కుమారుఁజూచి శోకాక్రాంతయై కన్నీరుగార్చుచుఁ గుమారుని దగ్గరకుఁ బిలచి ముద్దాడి యిట్లనెను

"నాయనా! నీకు వివాహము గాఁకమున్నె నిన్నొంటరిగా విడిచి చనుటకై యెంతయుఁ జింతిల్లుచున్నదానను. అటుపయి సర్వమును భగవదనుగ్రహానుసారమే జరుగఁగలదు. శీఘ్రముగ వివాహమాడుము. నీశత్రువర్గముల విషమప్రయత్నములు నిన్నేమియు బాధింపనోపవు. సర్వకాల సర్వావస్థలయందును భగవంతుఁడు నిన్నుఁ గాపాడుఁగాక." అని దీవించి తనతలక్రింది దిండును జూపించి "నాయనా! నామరణానంతరము నీదిండును విప్పిచూడుము. అందుఁ గొంత ధనముండఁగలదు. అంత్యకాలమున నీతల్లి నీకొసంగెడు కానుక యిద్యదియే." అని చెప్పెను. మఱియు మదనుని హస్తమున సుందరుని కరంబునిచ్చి "మీయిరువుర మైత్రి శాశ్వతమై జగత్ప్రసిద్ధమై వర్ధిల్లుఁగాక." అని యామె వారి నాశీర్వదించుచు నసువులవిడిచెను. మదనుఁడును సుందరుఁడును నొకవైపున నేలపైఁబ్రాలి రాజ్యలక్ష్మి యాత్మ రక్షించుటకు భగవంతునిఁ బ్రార్థించిరి. శవమును స్మశానవాటికకు మోసికొనఁబోవ బ్రాహ్మణు లెవ్వరును నియ్యకొనరైరి. కారణమడుగ సుందరుఁడు స్వాములవారి యానతిప్రకారము మాంతు యందున్నటుల వెలియయ్యెను. సుందరుఁ డిద్దాని వినినంతనె దిగ్భ్రమనొంది యేమియుఁదోఁచక నిలువంబడెను. అంత మదనుఁడు మిక్కుటముగ ధనమిచ్చి బ్రాహ్మణులఁ గొందఱ నొప్పించి రాజ్యలక్ష్మికి దహన సంస్కారము లొనరింపఁజేసెను. మదనుని సాహాయ్యమున సుందరుఁడు దల్లికిఁ గర్మక్రతువుల నెల్లఁ గావించెను. కర్మజరిగిన మఱునాఁడు స్వామివారి యాస్థానమునుండి సుందరునకు, నాతని తల్లియొక్క కర్మక్రియలయందుఁ దోడ్పడినవారలకును దక్షిణస్వాములవారిని దర్శించుటకై యుత్తరువు లంపఁబడెను. సుందరునకుఁ దోడ్పడిన విప్రులందఱు నాలస్యముసేయక స్వామివారిని క్షమాపణను వేఁడి వారివలనఁ దీర్థములఁ బుచ్చుకొని మన్ననవడసిరి. సుందరుఁడిది యంతయును వేణుగోపాల శర్మగారి కృత్రిమమువలన జరిగినదని యెఱిఁగి స్వాములవారిని సందర్శింపఁడయ్యె. తమ యాజ్ఞానుసారముగ సుందరుఁడు దమ్ము సందర్శింపనందులకు స్వాములవారు సుందరుని యాంక్షను ఖాయపఱచెను.

## ఇరువదియైదవ ప్రకరణము.

## ఇరువదియైదవ ప్రకరణము.

### ఉపన్యాసము.

సుందరుని విద్యోన్నతికిని, వానికి రాజధానియందుఁ గలిగిన గౌరవమునకును, సింహపురవాసులెంతయు సంతసించిరి. అతఁడు జనని యవసానకాలమున సింహపురిని జేరినంతనె యాతనిమిత్రులగు సంఘసంస్కారవిషయమై యుపన్యసింపవలసినదని యెంతయు వేడ నద్దానికి యొప్పుకొనెను. ఒకనాఁటి సాయంకాలమున సుందరుఁడుపన్యాసము నిచ్చునని నగరమునఁ బ్రచురింపబడెను. ఆయుపన్యాసమును వినుటకై సింహపురమందలి స్త్రీపురుషులనేకులు నగరభవనమునం గూడిరి. విద్వాంసులును, న్యాయవాదులును, వర్తకులును, భూస్వాములును, విద్యార్థులును సభనలంకరించిరి. వేణుగోపాలశర్మగారును స్వాములవారి దివాన్‌జీగారును వచ్చియుండిరి. సుందరుఁడున్నతస్థానమున నిలుచుండి సభాసదులనెల్లరఁ దిలకించి హిందూసంఘమందుఁ గాన్పించు ననేక లోపములఁ జర్చించుచు నాలోపములఁ బరిమార్చిన జ్ఞానులయొక్క త్యాగమునకును, దీనజనరక్షణమునకును, స్త్రీపురుషులందఱు బాధ్యులఁ గావలయునని యెంతయు నొక్కిచెప్పుచుఁ దుదకిట్టులనెను.

సభాసదులారా! మన దేశమునందు జాతిభేదములవలనను, మతభేదములవలనను, మన సోదరులయందు మైత్రిలేమిం జేసి మనమిపుడన్నివిషయములయందును దీనస్థితియందున్నారము. ఇట్టిభేదములఁ బాపు నుపాయముల మనమందఱము గనవలసియున్నారము. మతాధిపతులైనను, మతాధిపతులైనను, నిట్టి భేదములమాపుటకై కృషిచేయువారు దేశాభిమానులు అటులచేయక లేనిభేదములఁ గల్పించుకొని వ్యర్థములైన యాంక్షలచే జ్ఞానులనవమానించి కష్టపెట్టుచుండెడు పాపుల నీప్రపంచమున నెట్టియున్నతపదవియందున్నను దేశవైరులుగా నెన్నఁదగినవారుగాని దేశాభిమానులుగారు. ఆదియందీమతములు వేదవేదాంతోద్ధరణమునకై స్థాపింపఁబడినవి. ఈవిషయమునందొకింతయుఁ జర్చింపక యెపుడు భిక్షులతోడను, శాంతులతోడను, కాలయాపనము సేయువారల యాజ్ఞలకు లోనైయుండ నవశ్యములేదు. అట్టివారిం బూజింప నేమియు ఫలంబులేదు. అని యనేకభంగుల సంఘసంస్కరణార్థ విషయములఁ గూర్చియు జనసేవం గూర్చియుఁ జర్చించెను. ఈయుపన్యాసము వినినతోడనే సభ్యులనేకులు సుందరుని శ్లాఘింపఁదొడంగిరి. సుందరుఁడు దూషణభూషణలను సరకుగొనక పలుతావుల నీవిషయములంగూర్చి యుపన్యసింపఁదొడంగెను. స్వాములవారు సింహపురమునకు విచ్చేసి విశేషకాలమయినందునను చిన్నిరాయని పురవాసులాహ్వానము పంపినందునను సింహపురింబాసి వెళ్ళంబ చిన్నిరాయని పురముం జేరిరి.

## ఇరువదియాఱవ ప్రకరణము.

## దురాలోచన.

పిమ్మట నొకనాఁటి సాయంకాలసమయమున వేణుగోపాల శర్మగారియింట నేవురు పురుషులు చేరి యాలోచన సేయుచుండిరి. అందున్నవారిలో వేణుగోపాల శర్మగారిని మనకిదివఱకే తెలియును. తక్కిన నలువురిలో నిరువురు బ్రాహ్మణులు నిరువురు శూద్రులుగా నుండిరి. ఈనలువురు చిన్నరాయని పురవాసులు. వీరేవురును దీర్ఘకాల మిద్దానింగూర్చియే యతిరహస్యముగ నాలోచించుచుండిరి. వారిమొగ ములఁజూడ వారెద్దియో యొక ప్రమాదకరమగు విషయమునుగూర్చి యాలోచించుచు న్నట్లుఁ దెలియవచ్చును. అంతఁ గొంతకాలమునకు వేణుగోపాల శర్మగారదటనున్న బ్రాహ్మణులలో నొక్కనిం దిలకించి యిట్లనెను.

ఇంకను నుపన్యాసములు జరుగుచున్నవా?

బ్రా—మెండగుచున్నవి. ఎక్కడఁజూచినను జాతిభ్రష్టత్వము గావలెననియుఁ, గులాచారములు నేలఁ గలుపవలెననియు, స్వాములవారి యానలఁ దిరస్కరింపవలె ననియు నుపన్యాసములు జరుగుచున్నవి. మాయూరనే యిప్పటికి నాలుగైనవి. ప్రక్క గ్రామములయందుఁగూడ సుందర మదను లుపన్యాసము లిచ్చుటకుఁ బ్రయత్నము చేసికొనియున్నారు. అప్పుడు నటనున్న యిరువురు గాఁపులలో నొకఁ డిట్లనియెను.

అయ్యా! దీనికంతయుఁ గారణభూతుఁడు మదనుఁడే. వానివలన మాగ్రామము పాడగునట్లున్నది.

వే—కాదు కాదు. మదనునిఁ జెడిచినది సుందరుఁడే. ఆదుర్మార్గుని బరిమార్చిన నంతయు సరియగును.

బ్రా—వీరిరువురిలో నెవరున్నను ప్రపంచమునకు హానియే!

వే—అట్టులయిన మీయిష్టవచ్చినట్లుఁ గావింపుఁడు.

బ్రా—మీసాహాయ్యము పరిపూర్ణముగ నుండఁగోరెదము.

వేణు.—అభ్యంతరము లేదు.

అంత నానలువురు పురుషులును వేణుగోపాలశర్మగారి సదనము వెలువడిరి.

శర్మగారేమియుఁ దోఁచనివానివలె నిటునటుఁ గొంత తడవు పాఱక తిరిగి, యాగదియందున్న యొక పేటికం దెఱచి, యద్దానిలోనుండి యొక లేఖనముం దీసి చదువ నారంభించెను. అది ముగిసినపిమ్మట, మఱల నా బాబును పేటికయందిడి తనలోఁ దానిట్లనుకొనఁ దొడంగెను.

ఓహో! యిది మనకనుకూలమే కేవుగదా విష్ణుశర్మ రాజధానిం జేరునది. నే నిపుడే రాజధానికేగెదను. ఈఘోరకృత్యము జరుగునపుడు నేనిచట నుండఁదగదు. ఏమంటివి? ఘోరకృత్యమనియా? కాదు మున్ను మతాచార విరోధులగు దుర్మార్గులఁ గొట్టార్చుటకై శ్రీమన్నారాయణుఁడు ప్రపంచమున నవతరించలేదా? సుందరా! నీవా! నన్నుఁ దిరస్కరించువాఁడవు? నీ ప్రాణములను నీవు గాపాడుకొనుము. అని యాతఁడు త్వరితముగ రాజధానికిఁ బయనమై యువడలెను.



# ఇరువదియేడవప్రకరణము.

## ఘోరకృత్యములు.

మఱునాఁడు సాయంకాలసమయమున రాజధానియందు బంధుమిత్రసమేతుఁడై వేణుగోపాలశర్మ కుమారుని సందర్శించు కుతూహలమున ధూమశకటనిలయమునకేగెను. ఆనాఁటిబండియందు విష్ణుశర్మ రాఁడాయెను. కాని మఱునాఁడే తెంచునటుల విష్ణుశర్మయొద్దనుండి తంతివర్తమానము రాఁబడెను. మఱునాఁడు మఱల వేణుగోపాలశర్మ ధూమశకట నిలయమునకుఁ జని కుమారునికొఱకై వేచియుండెను. బొంబాయినగరమునుండి ధూమశకటమేతేఱ వేణుగోపాలశర్మ యాశకటమంతయుఁ గుమారునకై వెదకెను; గాని యతఁడు గాన్పించనందున నాఁటికిని విష్ణుశర్మ రాలేదని యనుకొని దీనవదనమున నొకచెంతనిలువబడెను. అప్పుడొక యువజనుఁడాంగ్లేయుల యుడుపులధరించి కడు రాజసమున వేణుగోపాల శర్మగారి కడకేతెంచి నమస్కారపూర్వకముగ తండ్రీ! నన్ను గుర్తింపలేదా? అని యడిగెను. అపుడు వేణుగోపాలశర్మ కుమారుని గుర్తించి మిగులఁ దమకమున నాతనిఁ గౌఁగిలించి ముద్దాడెను. కొంతతడవు తండ్రితో ముచ్చటించి తనమిత్రులగు కొందఱాంగ్లేయులతో రాజధానియందున్న యొక యాంగ్లేయ భోజన శాలయందుఁ దామఁట నిశ్చయించుకొన్నటులను, మఱునాఁటి యుదయమున దండ్రి గల తావునకు రాఁగలనటుల వేణుగోపాలశర్మగారి కెఱింగించి విష్ణుశర్మ యచ్చోటు వాసెను.

కుమారుని జాతిభ్రష్టత్వమున కెంతయుఁ జింతిల్లుచు వేణుగోపాలశర్మ నిజ మందిరమును జేరెను. మఱునాఁటి యుదయమున స్నానసంధ్యాద్యనుష్ఠానములఁ దీర్చి కుమారుని యావాసమునకేగెను. కుమారుఁడెచటికో యాకస్మికముగ నేగినటుల తెలియఁగ యాతనికొఱకు గొంతతడవు వేచియుండ నతఁడతి రౌద్రాకారమున నిలుసేరెను. కుమారుని వెంటనే తండ్రియు లోనికిఁ జని యాతనిచెంతఁ గూర్చుండి నాయనా! సంతాపమునకుఁ గారణమేమి? యని యడిగెను. అంతలను విష్ణుశర్మ కారణమీవ యనిన వేణుగోపాలశర్మ యతిసంభ్రమమున నేనా? నేనేమిచేసితి ననెను.

విష్ణు. ఏమిచేసితి ననియెదవా? నీవేమిచేసినది యీవార్తాపత్రిక యందు గలదు. నేనీ యుదయమున నీరాకకై వేచియుండ కమల యత్యావశ్యకముగ నన్ను రమ్మని కబురంపె. ఆమెతావునకుం జన నెల్లవిషయములను దెల్లమయ్యె. హా! జనకా భగవంతుఁడు నీపాపమునుండి నన్నుఁ గాపాడుఁగాక. నాపుడు వేణుగోపాలశర్మ నిశ్చేష్టితుఁడయ్యె. విష్ణుశర్మ వార్తాపత్రికనుండి యిట్లుఁ జదువఁ దొడంగెను.

సింహపుర వృత్తాంతములు. నిన్నటిదినమున నీపురమున కవలిభాగమున

నున్న చిన్నరాయని పురమున నతిఘోరముగు వధ జరుపఁబడెను. ఈపురి నివాసుఁడును విశ్వవిద్యాలయమునఁ బ్రసిద్ధిగాంచినవాఁడును నగు సుందరుఁడును నతని మిత్రుఁడును చిన్నరాయని పురనివాసుండును నగుమదనుండును సంఘ సంస్కార విషయములను గుఱించి చెంతనుండు గ్రామముల నుపన్యసించి యింటికేతెంచునతి రాత్రికాలమున దారిలోఁ గొందఱు వారలఁ జంపనుద్దేశముఁ బైఁబడి ఘోరాయుధంబుల నిరువుర హింసించినట్లును మదనుఁడావ్రేటున మృతిచెందినట్లునుఁ సుందరుఁడు స్మృతిహీనుఁడై క్రిందబడినట్లును వారిఁడిపుడు సింహపుర వైద్యశాలయందున్నట్లును, నతనిబ్రతుకు దుర్ఘటముగ నున్నట్లున్న విని మిక్కిలిచింతించుచున్నారు. ఈవిషయమునఁ జిన్నరాయని పురనివాసు లనేకు లిప్పటికే దండనాధికారులచేఁ బట్టుపడిరట. ఇంకననేకులు గౌరవనీయులు నీపురమునవున్న న్యాయవాదులుం గొందఱు నీఘోరకృత్యమునందుఁ గలిసినట్లుఁ దెలియవచ్చినదట. శీఘ్రముగ ననేకులు పట్టుబడఁగలరు.

నీయుద్యమము ఫలించెనా.

అప్పుడు వేణుగోపాలశర్మ నిశ్చేష్టితుఁడై యేమిచెప్పుటకు నోరాడక యూరక నిలువంబడెను. ఎట్టకేలకు ధైర్యము తెచ్చుకొని ఎవ్విధమున నైన శత్రు నాశనము సమ్మతముగదా అనెను.

విష్ణు. ఏరికి సమ్మతము! నీబోటి కిరాతులకా?

వేణు. నాయనా? మన సంసార సుఖభంగమునకుఁ గారణభూతుఁడు సుందరుఁడు. అతని కృత్యములయం దన్నిటియందును మదనుఁడు తోడైయుండెడి వాఁడు. అట్టి వారియందుఁ గనికరముంచరాదు. నినుగూడు నాసచే నన్ని కష్టములు మఱచియుంటిని. ఇట్టిసమయమున నాకుఁ దోడైయుండక నన్ను విడనాడఁజూచుట ధర్మమా? అని కన్నీరుగార్చుచుఁ గుమారునిఁ గరంబులఁ బట్టుకొనెను.

విష్ణు. అయ్యో! వినుము. నీ యీకార్యమువలన గమలా శారదలు బ్రతికి యుండుట దుర్లభము. ఇఁక నీవు సుఖముగ నుండనగును. నీకును నాకును నేటితో ఋణము తీరినదనుకొనుము. పితృబాంధవ్యము నేనొల్లను నీప్రాయశ్చిత్తము నాకవసరము లేదు. నాయందుఁ దయగొని యీక్షణమున నన్నుఁ బాయుము. నీదగు కఠినహృదయమునకును పాపకర్మములకును భగవంతుఁడు నీకుఁ బ్రతిఫలమొసఁగుఁగాక. అని యట నున్న తనగదిలోనికి బోయి ద్వారమును మూసికొనెను. వేణుగోపాలశర్మ యతి శోకాక్రాంత మానసుండై యేమియుఁదోఁచక వెలవడి తక్షణమున సింహపురమునకు బయనమైనవాఁడయ్యెను. దారియందంతటఁ వేణుగోపాలశర్మ యతిహీనాకారుఁడై యెద్దియో యోజించుచుండెను. ధూమశకటము సింహపురముఁ జేరునప్పటికిని రాసమ

యమయ్యెను. తిన్నఁగ నింటికిఁజని కవాటముల బంధించి యొంటిగా దలఁతిరుగుచు మాటాడుకొనుచుండెను. ఎట్టకేలకుఁ దన పెటికం దీసి యద్దానినుండి యొకగాజుపాత్రమును వెలికిదీసి చేతనుంచుకొని యిట్లనఁదొడంగెను.

హా! దండనాధికారులవలని భయమొక చింత బాధించుచుండ, కష్టశర్మ కఠినోక్తులు నన్నుఁ జంపుచున్నవి. కుమారా! నన్ను విడనాడుట నీకు న్యాయమా? అవును. వేణుగోపాలశర్మ కుమారుఁడన్న నీకును నవమానముగదా! సుందరా! నీవే జయించితివి! హా! నేనట్టిపాపిని! ఎట్టిమూర్ఖుఁడను. ఇఁక నేను జీవించియు నేమి ఫలము? అవమానము దప్పదు. అని యాగాజుపాత్రమును నోటఁబెట్టుకొని యందున్న ద్రావకమును ద్రాగెను.

కొంత తడవిట్టు నట్టు తిరిగి, క్రిందఁబడి యిట్లులార్వ నారంభించెను.

ఎవ్వరమీరు? నన్ను లాగకుఁడు. త్రోయకుఁడు. నేనవచ్చెదను. అయ్యో! మదనా! ఏల యీలాగు చూచెదవు? ఈకింకరుల బారినుండి నన్ను రక్షింపుము. అయ్యో! చచ్చితి. చచ్చితిని.

ఇట్లు కొంత తడవఱచి ప్రాణములు విడిచెను. మఱునాఁటి యుదయమున దండనాధికారులు వేణుగోపాలశర్మ రాతిరి యిలుసేరినదెఱిఁగి వారిఁగొఱకై యచ్చోఁ జేరిరి. దాని కవాటములు బంధితములై యుండెను. ఎంత యఱచినను నెవ్వరును ద్వారముం దెఱువరైరి. పిదప వారు కవాటములఁ బగులఁగొట్టి లోనికిం జని కని రపు డాత్మహత్యచేఁ బ్రాణములఁ బాపుకొన్న వేణుగోపాలశర్మగారి కళేబర మతిఘోరముగఁ గ్రిందఁబడియుండెను.



## ఇరువదియెనిమిదవ ప్రకరణము.

### తానొకటి తలఁచిన దైవమొకటి తలఁచును

మదనునియందుఁ జిన్నిరాయపుర నివాసులనేకుల కసూయతయున్నను వానినిఁ జంపునుద్దేశము బాణకోదండుల యాప్తబంధువులకుమాత్రము గలిగినది. కావున వాని మరణము విన్నంతనె యాపురమున నల్లకల్లోలము గలిగెను. మదనుని సుగుణములెల్ల నపుడు ప్రఖ్యాతికి రాఁదొడంగెను. అతనిఁ జంపిన వారియందేరును గనికరముంచక మరణదండనకుఁ బాత్రులఁ గావించిరి. మదనుని మరణము విన్నంతనె యాతని జననియగు కౌసల్య భరింపరాని శోకమునఁ బ్రాణములు విడిచెను. తత్పురవాసులెల్లరు నిరపరాధియు ధర్మాత్ముఁడును నగు మదనుని గుణాతిశయముఁ దలఁచుకొని మిక్కిలి చింతాక్రాంతులైరి. మాతృసుతులపేర నొక యాలయము నిర్మించి వారల నందుఁ బ్రతిష్ఠజేసి పూజింపఁ దొడంగిరి.

సుందరుఁడు క్రమముగ కమల శారదలయొక్కయు, విష్ణుశర్మయొక్కయు నుపచర్యలచే స్వస్థుండాయెను. మదనుఁడు జీవించియుండఁగనె తనయున్న గ్రామవైరమువలనఁ బ్రాణాపాయము గలుగవచ్చునని యాలోచించి, తాన కాలమునఁ జచ్చిన యెడల జరుగవలసిన కార్యముల నొక పత్రికయందు లిఖించియుంచెను. తనతల్లి జీవితమునకుఁ గావలసిన కొలఁదియాస్తిదక్క, తక్కిన తనయాస్తిచేఁ జిన్నిరాయని పురమున నిమ్నజనోద్ధారణమునకై యొక విద్యాలయము నిర్మింపఁబడవలెననియు నద్దానియందన్ని జాతుల బాలురకును బాలికలకును ధర్మార్థముగ విద్య నేర్పింపవలెననియు, నద్దాని కంతకు సుందరుఁడు కార్యనిర్వాహకుఁడుగ నుండవలెననియు, మదనుఁడు లిఖించెను. మదనుని యుద్యమము లరసినంతనె చిన్నిరాయని పురవాసులందఱు మిక్కుటముగ సుందరునకు సహాయులై విద్యాలయమును బూర్తిగావించి "మదనుని విద్యాలయము"ని నామకరణము గావించిరి. సింహపురమందలి నిమ్నజాతులవారందఱు మదనుని దైవముగఁ గొలుచుచు నాతని విద్యాలయమునకుఁ దమ బాలుర నంపిరి.

తరువాతఁ గొన్నినాళ్ళకుఁ గమలా సుందరులును, శారదా విష్ణుశర్మలును బ్రహ్మసామాజిక పద్ధతులప్రకారము నొండొరులఁ బరిణయమాడిరి. వారు రాజధానియందేయుండి యత్యున్నత పదవిం జేరిరి. ప్రతి సంవత్సరమును మదనుని మరణదినమున వారందఱును చిన్నిరాయని పురమునకుఁ జని యచ్చో మదనునిఁ బూజించుచుండిరి. సుందరునకు గలిగిన ప్రథమ పుత్రునకు మదనుని నామమిడిరి. మదనుఁడు చచ్చియును బ్రతికియేయున్నవాఁడు. అతనికీర్తి యాచంద్రార్కముగఁ బ్రపంచమున వర్ధిల్లు

యుండును. కాని వేణుగోపాలశర్మను దలంచువారొక్కరును లేరు. తన బిడ్డల [illegible] నావేఁబడి, తానుచేసిన పాపకృత్యములకు జింతిల్లుచు, నాత్మహత్య గావించుకొన్న యా వేణుగోపాలశర్మ యదృశ్యము లేవి గొనసాగినవి? నాహాకటి తలంచిన [illegible] కటి తలఁచును. ధర్మమే జయించును.

చదువరులారా! ప్రపంచమున న్యాయముగఁ బ్రవర్తించు సింహాద్రులను [illegible] ము లనేకములు గలుగుచుండును. ఎట్టికష్టములకును నెదురీదుక మనన సుందరమ్మవలె దీనరక్షణాసక్తులై పాటుపడు మహానీయులు, పూజనీయులు.

సమాప్తము.



Printed by Gumpani Hanumantha Row, at the
Maruti Press, Bezwada.